G No M 2185 REG No N 45

The First Telgu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for
H E H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁ బడును.

హైదరాబాదు—దక్కను

GOLKONDA PATRIKA.

103\20 HYDERABAD Dn.

సంపుటము ౫ { ప్రమోదూతనామసంవత్సర ఆషాఢ శు|| ౨ శనివారము 28—6—30 { సంచిక ౧౫

# సైమన్ కమిషను వారి సూచనలు

## సైమన్ నివేదిక రెండవభాగము

౨౪ వ తేదీన ప్రకటింప బడెను

ద్వంద్వ పరిపాలనము తొలగింప బడినది

స్వపరి పాలన కలలోని వార్త

బర్మా రాష్ట్రము వేరుచేయ బడును

### స్వరాజ్య సత్యాగ్రహము ప్రారంభింపబడినను మా సూచనలో యెట్టి మార్పును జరుగలేదు

మేము యీ నివేదికను వ్రాయుటలో యిటీవల కొన్ని నెలలనుండి భారతదేశమునందు జరుగుచున్న విషయమును స్వరాజ్య సత్యాగ్రహమును గూర్చి మేమిందులో నేమియు వివరించి యుండలేదు. ఏలననగా యీ యుద్యమము ప్రారంభింపబడుటకు పూర్వమే యీ సూచన లన్నియును మాచే ఏకగ్రీవముగా సాధింపబడియుండెను. అందువలన దరిమిలాను జరిగిన విషయములను బట్టి మేము వెనుక చేసిన సూచనలలో మరల యెట్టి మార్పును చేసియుండలేదు. ఏలననగా మేము విశాల భావముతోను దూరదృష్టితోను సూచనలు చేయుటవసరమై యున్నది.

కొన్ని వత్సరముల కొకసారి భారతీయుల రాజకీయావస్థలను గూర్చి పరీక్షించుచుండుటవలన భారతీయుల రాజకీయజీవితములకును, నూతన సంస్కరణముల అభివృద్ధికిని చాల నష్టము గలుగునని మాకు గట్టినమ్మకము గలిగినది. వెనుక మాంటేగ్ చెమ్స్‌ఫర్డ్ గారు చేసిన సూచనలలో నుండెడు దోషము లెట్టియుండినను పదియేండ్ల పర్యంతము ఆవిధానము పరీక్షింపబడునని నిర్ణయింపబడుట వలన అది అస్థిరము అను భావము ఎల్లవారికి యేర్పడినది. అందువలన ఆవిధానము నెరవేర్చుటలో చాల అవరోధములు కలుగుట నిశ్చయము. పదియేండ్ల అనంతరము క్రొత్త నూతన సంస్కరణములలో తమకు యెట్టి లాభనష్టములు కలుగునో యని ప్రతిసంఘము వారుగూడ నూతనసంస్కరణముల కొఱకు ఎదురు జూచుట తటస్థించినది. అందువలన ప్రతిసంఘమును తనస్థానమును బలపరచుటకు తీవ్రప్రయత్నములు చేయసాగెను. అందువలన వివిధసంఘములలో స్పర్ధలు చాల ప్రబలమైనవి. చిన్న చిన్న సంఘములన్నియును; ఒక పెద్ద సంఘముగా యేర్పడుట తటస్థించినది. పదియేండ్లయనంతరము లభించెడు సంస్కరణముల యందు అధికముగు లాభమును బడయవలెనను నుద్దేశ్యములతో ప్రజలు వెల్లడించెడి భావములబట్టి వేరు వేరుపక్షములుగా వారు విభజింపబడిరి,

ముందు జరుగనున్న అభివృద్ధిని అనుగుణ్యముల సూచనలను యిప్పుడు చేయుటయును, వానినిబట్టి తగిన రాజ్యాంగవిధానము నమలులో పెట్టుటయును సాధ్యమునందలి అభివృద్ధి యొక్కయు సామరస్యము యొక్కయు విధానమును బట్టి భారత ప్రభుత్వము క్రమాభివృద్ధిని చేయుటకు తగిన యేర్పాటులను ఒక్క చట్టములో సూచించుట అసంభవమని మేము నమ్ముచున్నాము. భారత దేశము యొక్క రాజకీయ స్వరూప పరమావధిని 1917 ఆగస్టు 20 వ తేదిని చేయబడిన ప్రకటనలో బ్రిటిష్ దొరతనమువారే నిర్ధారణచేసి యున్నారు, కావున క్రమముగా ఆ పరమావధి లభింప గల్గుటకు తగిన యేర్పాటులన్నియును యిప్పుడు చేయబడనున్న రాజ్యాంగ విధానమునందు చేసియుండవలెను. కేవలము బ్రిటిష్ ఇండియా మాత్రమే గాక భారతదేశము యావత్తునుకూడ అట్టి అభివృద్ధిని బడయగల్గినప్పుడే బ్రిటిష్ సామ్రాజ్యము నందలి యితర దేశముల సమానము భారతదేశము బడయగలదు, ప్రపంచమునందలి వివిధ దేశములలో భారతదేశము కూడ నొక్కటియని ప్రకటింపబడుటవలన మాకింక ఎక్కువ బలము చేకూరుచున్నది. భారతదేశమునందు వేరు ప్రాంతములలో జాతి, మతము, భాష, విజ్ఞానము శరీరసాదృశ్యము, శీతోష్ణ భేదము మొదలగునవెన్ని యుండినను, యీ భేదములు ఎంతమాత్రము పరిగణింపబడదగినవి గావు. భరత ఖండమునందుగల భిన్నత్వములందు ప్రధానమైనదియు ఏకత్వమగుటవల్లను, అఖండమునంతయు ఒక్కదేశముగానే భావింపవలసియుండును. కావున భారతదేశమునందంతటను, శాంతియును, సంపదయును నెలకొనవలెనని, ముందుగా బ్రిటిష్ ఇండియాలోని ప్రజలకును, సంస్థానములలోని ప్రజలకును సామరస్యము చేకూరవలెను.

### రాష్ట్రీయ స్వపరిపాలనము

ప్రజలు రాష్ట్రీయస్వపరిపాలనము నిప్పుడు హెచ్చుగా కోరుచుండుటకు రాష్ట్రీయాభిమానము ముఖ్యకారణమైయున్నను అందులకు కొంతవరకు యితర కారణములు కూడ తోడ్పడుచున్నవి. మొదటిది భారత ప్రభుత్వ స్థానమగు ఢిల్లీనగరము మిక్కిలి దూరముగానున్నది. రెండవది భారతశాసనసభకు లభించిన సౌకర్యములకంటె రాష్ట్రీయ శాసనసభలకు యిదివరకు హెచ్చు సౌకర్యములు లభించియుండుటచే తమకు సంపూర్ణ స్వపరిపాలనముకూడ నొసగవలెనని వారు కోరుట కవకాశము గల్గినది. మూడవది ఆయా రాష్ట్రములందున్న ప్రజలలో అధిక సంఖ్యాకులగువారు ఎక్కువ సముదాయములను బడయవలెనను ఆశతో యుండుటవలనకూడ రాష్ట్రీయ స్వపరిపాలనము కోరబడుచున్నది. కాని రాష్ట్రములలో స్వపరిపాలనము ఏర్పడుటకు ప్రస్తుతమున్న రాష్ట్ర విభజనము అనుకూలముగా లేదు. అందువలన రాష్ట్రములను మరల విభజించుట అవసరమై యున్నది,

బర్మాదేశము లోనిది కాదు. ఈరెండు దేశముల యొక్క అవసరములు సమానములు గావు, కావున వెంటనే యీ రెండు దేశములను విడదీయుట యావశ్యకము.

### భారతప్రభుత్వాభివృద్ధికి యితర విధానములను సూచించుట

రాష్ట్రముల విషయమున బ్రిటిషు దేశమునందలి పార్లమెంటు విధానమును యిందులో పెట్టుటకు తగిన అవకాశము

## సైమను నివేదిక

### ప్రముఖుల అభిప్రాయములు

### "ఇదొక చీకిపోయిన కోడిగుడ్డు"

సర్ జాన్ సైమన్ ఒక చీకిపోయిన క్రోడి గుడ్డును పెట్టెను. స్వల్పాశా పేకములగు కొందరు మహమ్మదీయులు దీనివాసన బాగుగానున్నదని యనవచ్చునుకాని మొత్తము భారతీయులు దీనిని దూరముగానే పారవేతురని నమ్ముచున్నాను.

సెంట్ నిహాల్ సింగు.

సైమన్ నివేదిక చదువుటకొక తప్పు. దానిని ఖరీదుచేయుట గొప్పతప్పు. కాన మనము దీని పట్టవిముఖత చూపవలెను.

పండిత మోతిలాల్ నెహ్రూ

కమిషనునే బహిష్కరించినప్పుడు వారి సిఫారసులతో మనకేమిపని, తెలివిగల మనుజుడెవరేనియు పరే తన విముఖత చూపును.

విఠలభాయి పటేలు.

నివేదిక సంతృప్తికరముగా లేదు. వైస్రాయిగారును ప్రభుత మువారును రౌండు టేబిల్ సమావేశమును గురించి తమ నిశ్చితాభిప్రాయముల వెల్లడించి రాజకీయ ఖైదులు విడచినగాని పరిస్థితులు చక్కబడవు

య. చింతామణి.

౧౦ సంవత్సరముల క్రింద వెలువడవలసిన సిఫారసులు నేడు వెడలినవి. ఇవి నేటికాలమునకు పనికిరావు.

జే. యస్. ఖాను

ఈరిపోర్టు ప్రజలయందు మరింత అసంతృప్తిని కలుగజేయును.

జి. ఏ: నటేసన్

కమిషను భారతదేశమునకు వచ్చినప్పుడు బహిష్కరించినవారలు ఈసిఫారసుల గుర్తెరిగియే చేసిరి.

వే రామదాసపంతులు.

పండిత మోతీలాలుగారి అభిప్రాయముతో నేనేకీభవించుచున్నాను. గొర్నరులకు సంపూర్ణ స్వాతంత్ర్యము నొసగి సంయుక్తపక్షదేశమునకు దొరకుచున్నదని తెలుపు నివేదికనట్టి మోసగింపు నివేదిక.

సర్ ఫిరోజ్ సేత్నా.

పెక్కుచోట్ల అసంతృప్తికరములగు సిఫారసులు చేయబడినవి

ఏ. ఫజల్ హక్కు.

రాష్ట్రములందు బాధ్యతాయుత ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వము కేంద్ర ప్రభుత్వమున నిరంకుశాధికారమును కూడ మరల ఇంకొక రూపమున ద్వంద్వ ప్రభుత్వముగ గన్పించుచున్నది.

సి. యస్. అంగ్రమాను.

రౌండు టేబిల్ సభ జయప్రదము కావలెనన్నచో భారతీయులను బ్రిటిషువారితో సమానులుగజూచు రాజ్యాంగ విధానమును సిద్ధపరచుచున్నారమని తెలుపవలెను.

మేజర్ గ్రహాంపోలు

సైమను నివేదిక సంకుచితమైనది స్వరాజ్య విషయమున భారతీయాశయముల నది తెలిసికొనలేదు. ఒక ఫుటలోనైనను రాజనీతి కన్పింపదు దీనిని బహిష్కరించుటయే న్యాయము.

"ఆజ్వాన్సు"

ఈ నివేదిక కొందరి యందున్న ఆశను చంపుచున్నది, విచారణకు అసలే పనికిరాదు, చూచుటకుగూడ నవ్యముగా నున్నది వారి సిఫారసుల ఖండించి, కాలితో రాయవలయును

"లీడర్"

## దేశీయ వస్తువులు

### ఇంగ్లాండు దేశము తరువాతవి

| | |
|---|---|
| సిద్ధిపేట చీరలు | (సిద్ధిపేట, నైజాం) |
| పెంబర్తి ఇత్తడి సామాలు | (పెంబర్తి, నైజాం) |
| టస్సర్ సిల్కు | (వరంగల్లు, నైజాం) |
| నఫీసు సబ్బులు | ( హైద్రాబాదు ) |
| దక్కన్ గ్లాసువర్కుసు | ( హైద్రాబాదు ) |
| గుల్బర్గామిల్లు బట్టలు | ( నైజాం ) |
| మైసూరు సోపుఫ్యాక్టరి | ( మైసూరు ) |
| మద్రాసు పెన్సిల్ ఫ్యాక్టరి | ( మద్రాసు ) |
| పండ్ల పొడి | ( నంజనగూడు ) |
| ఇండియన్ మ్యాచ్ ఫ్యాక్టరి | ( బర్మా ) |
| చార్మినార్ సిగరెట్లు | ( హైద్రాబాదు ) |
| మద్రాసు పైపుఫౌండరి | [మద్రాసు] |
| స్వదేశీ పైపుఫౌండరి | [ " ] |

"సత్యం"

## ఆంధ్ర దేశ వార్తలు

### ఆంధ్రదేశమున సత్యాగ్రహసమరము.

#### ప్రతిదినము ఘోరాకృతి దాల్చుచున్నది

#### ఆంధ్రదేశీయులకు కఠిన శిక్ష

#### కృష్ణారావుగారు-ప్రభుత్వముతో సహకారము

#### ము॥ కృష్ణారావుగారి అరెస్టు

బందరులో కృష్ణాపత్రికాధిపతియును, ఆంధ్రదేశీయులకు నగు శ్రీయుత ముట్నూరి కృష్ణారావు పంతులుగారు ఆక్రమ సంఘసభ్యులను నేరముపై అరెస్టు చేయబడి రెండు సంవత్సరముల కఠినశిక్ష విధింపబడిరి.

#### నెల్లూరు

#### ఊటుకూరు గ్రామ అరెస్టులు

నెల్లూరులో నేటివరకు నాలుగువందల అరెస్టులు జరిగినవని పత్రికారిపోర్టులవలన తేటపడుచున్నది. ఊటుకూరు గ్రామములో పలువురరెస్టు నిర్బంధింపబడి శిక్షింప బడిరి.

#### కాకినాడ

#### వలంటీర్లు జన్మస్థానముల నున్నారు

కాకినాడయందు లవణసత్యాగ్రహ నిమిత్తమై వచ్చిన వలంటీర్లు తమ తమ జన్మస్థానములకు వెడలిరి. డాక్టరు మేల్కోటే (హైద్రాబాదు) బెంగుళూరులో నున్నారు. నండూరి కృష్ణమాచార్యులు హైద్రాబాదునకు వెడలిరి. వీరందరికి లాఠీదెబ్బలు తీవ్రముగా తగిలినవి.

## నేటి వరకు నిర్బంధింప బడిన భారత యోధుల సంఖ్య

| | |
|---|---|
| పారసీలు | ౯౦ |
| స్త్రీలు | ౧౬౦ |
| మహమ్మదీయులు | ౬౦౦ |
| హిందువులు, యితరులు | ౬౦౦౪ |
| | ౬౮౫౪ |

#### బెజవాడ ఇండ్ల సోదాలు

పోలీసులు ఆంధ్ర స్థాపకులు బ్రాహ్మణేతర పక్ష నాయకులునగు శ్రీయుత గూడవల్లి రామబ్రహ్మంగారి గృహమును, ఇతర పదిమంది గృహములను పోలీసువారు సోదాచేసిరి. ఏమియు లభించలేదని తెలియుచున్నది.

#### గుంటూరులో తెల్లటోపీలు

#### పలువురు అరెస్టు చేయబడిరి

గుంటూరులో గాంధి టోపీలను ధరించి తిరుగుచున్న పలువురు యువకులను పోలీసువారు అరెస్టు చేసిరి.

#### ఏలూరు నందు కాల్పులు

#### ౧౮ జనులు గాయపడిరి

ఏలూరిలోని సుప్రసిద్ధ నాయకులను అరెస్టు చేయుట వలన జనులు ఉత్సాహమును నిల్పుకొనలేక పోలీసు వారలను పరిహసించిరి. దీనిపై పోలీసు వారలు బెదరింపు సాగించగానే ప్రజలు తమ కోపమును వెల్లడించిరి. ఇందువలన పోలీసువారలు ప్రజల కాల్చిరి. ౧౮ గురికి గాయములు తగిలినవి. ఒకడు అపాయస్థితి యందున్నాడు

#### నిజాం రాష్ట్రీయునికి శిక్ష.

సుజాత పత్రికా వ్యవస్థాపకులుగా నుండిన శ్రీయుత లోకే అక్కినేని శర్మగారికి ౧౮౩, ౧౧౩, ౭౮ సెక్షనుల క్రింద ఒంగోలులో శాసనధిక్కార ప్రచారము గావించినందులకు ఒక సంవత్సర కఠినశిక్ష విధించ బడెను. వారు సి. క్లాసు తరగతి ఖైదీలలో చేర్చబడిరి.

గోలకొండ పత్రిక
ప్రమాదూతనామ సంవత్సర ఆషాఢ శు|| ౭
శనివారము

## సైమను నివేదిక
## రెండవభాగము

We asked for bread thou hast given us a stone instead—

సైమను కమిటీవారు తమ నివేదికను రెండు భాగములుగా విభజించి మొదటిదిమనకు ౧౫ దినముల క్రిందటనే వెల్లడించియుండిరి. దాని విషయమై మా యభిప్రాయ మిచ్చుచు మాకుగా రాబోవు రెండవభాగములో నేముండునో మా జ్యోతిషమును పాఠకులకు వెల్లడించియుంటిమి. ఇప్పుడా రెండవభాగము వెల్లడియైనది. మా జ్యోతిషములోని విషయమునకు, దీనిలోని విషయమునకు నేమియు భేదము లేకుండుటచే మా జ్యోతిష విజ్ఞానమును మా పాఠకులు ప్రశంసింపకమానరని తలచుచుము. మేమిదివరకు రాబోవు సంగతుల జూపినను మరల నిప్పుడు మా యభిప్రాయమును పాఠకులకు వెల్లడించుచున్నాము.

రెండవభాగము రిపోర్టులో హిందూస్థానమునకు వారియ్యదలచుకొనిన సిఫారసు లున్నవి. అసిఫారసులను జూచినట్లైన యెంతటి మితవాదియైనను, యెంతటి యుల్లాసియైనను నిరాశయొందక మానడు. మనదేశములో గత సంవత్సరము హిందూస్థానములోని అన్నిపార్టీలవారును కలిసి తమకేమి యిష్టముండెనో ఆ విషయములను నెహ్రూ రిపోర్టుద్వారా తెలిపియుండిరి. అందేకగ్రీవముగా నందరును మనకు డొమినియను హక్కు కావలెనని కోరియుండిరి. కాంగ్రెసువారిటీవల తమకు సంపూర్ణ స్వరాజ్యమే కావలెనని కోరుచు ప్రపంచమంతయు నాశ్చర్యపడునట్లుగా తమ యుద్యమమును నడపుచున్నారు. కాంగ్రెసు యుద్యమము ప్రారంభమైన తర్వాత మితవాదు లందఱును నేకగ్రీవముగా తమకు డొమినియను హక్కు తక్షణమే కావలెనని యనుచున్నారు.

ఇప్పుడు సైమను కమిటీవారు వీరందఱికి జవాబుగా నేమి చెప్పుచున్నారో యా విషయములను సూక్ష్మముగా నివేదించెదము.

౧. రాష్ట్రములలోని శాసనసభలలో నిదివరకు ద్వంద్వప్రభుత్వ ముండెను. అది సరిగా పనిచేయకపోవుటయు, స్వరాజ్యపార్టీ మెంబర్లు పలుమారు వాటి నడకల నాటంకపరచుటయు నీ పదిసంవత్సరములనుండి నాటి కార్యక్రమమును జూచినవారికి విశదమగును. కావున సైమను సంఘమువారిప్పుడా ద్వంద్వప్రభుత్వమును ఖండితముగా నెత్తివైచినారు. అట్లుచేయుటచే శాసనసభ్యుల యధికారములుమాత్రము హెచ్చుటకు మారుగా తగ్గింపబడినది. శాసనసభ్యులకు మీద విశ్వాస రాహిత్య తీర్మానమును మంత్రులపై ప్రయోగింపజాలరు మరియు మంత్రులలో ప్రభుత్వ సభ్యులును నుండవలెను. వారి సిఫారసులను గవర్నరుగారు వినవలెనని యేమియు కట్టుబాటులేదు. శాసనసభ తీర్మానములు గవర్నరుగారికి నచ్చకుండిన నవి అల్పసంఖ్యాకులకు నష్టమనియో ప్రజాశాంతికి భంగకరమనియో మనసెట్టి త్రోసివేయవచ్చును. అనగా గవర్నరుగారికి పూర్వముకన్న హెచ్చు హక్కు లిచ్చినారనియు సభ్యులకు పూర్వముకన్న తక్కువహక్కు లిచ్చిరనియు చెప్పవలసినది.

౨. రెండవమార్పేమన ఓట్లిచ్చువారి సంఖ్య హెచ్చుచేసినారు. ఇది సంతోషమైన మాటయే కాని యీ వోటర్లు పంపిన సభ్యుల యధికారములు తక్కువయైన ఓటర్లసంఖ్య హెచ్చయిననేమి తగ్గయిననేమి ఇట్లు హెచ్చుచేయుటచే "చూచితిరా మేమెంతటిగొప్పయధికారముల మీకిచ్చినారమో" యని బ్రిటిషువారికి చెప్పుకొనుటకొక సందు దొఱకినదన్నమాటయే కాని యింకేమియు లేదు.

౩. మూడవమార్పేమన మనదేశములో ముసల్మానులు తాము అధికసంఖ్యాకులగు హిందువుల నుండి భయపడి తమకు తమ సంఖ్యకన్న హెచ్చుగా తమ మెంబర్లు శాసనసభలలో కూర్చున వలెనని యాందోళనము చేయుచుండిరి ఇప్పుడు సైమను సంఘమువారు వీరి గడబడకు లోబడినట్లు నిరూపించుకొని ముసల్మానులు హిందువులకన్న హెచ్చుగానుండు పంజాబు బెంగాలు రాష్ట్రములలో కూడ వారికి శాసనసభద్వారా అధికమగునట్లు భద్రముగా రిజర్వు చేయవలెననియు, మున్నగు నితర రాష్ట్రములలో వారు తక్కువగానుండు స్థలములందును వారిసంఖ్యకన్న చాలహెచ్చుగా సీట్లను రిజర్వు చేయవలయునని సిఫారసు చేసినారు. సరిహద్దురాష్ట్రమున కిదివరకు శాసనసభ లేకుండెను. అందును నొకటి యుండవలెనని ముసల్మానుసోదరుల కోరిక నొప్పుకొనినారు సింధురాష్ట్రమునుకూడ ప్రత్యేకించవలెనని ముసల్మానులు కోరియుండిరి. అదికూడ అనుకూలపడును అని ఆశపెట్టినారు ఇవి ముసల్మానులయెడ జూపిన పక్షపాతములు మాకును సంతోషమే. కాని హిందూ ముసల్మానులలో నెల్లప్పుడును ద్వేషములు ప్రబలుటకివి మంచి సాధనములుగా పరిగణమించుచుననియే మాకు విషాదము కలుగుచున్నది.

[౪] నాల్గవ సిఫారసు ఏమన స్త్రీలకును, అస్పృశ్యులకును ఎక్కువవోట్లఅధికారము నిచ్చియున్నారు. ఇది చాల సంతోషమే

[౫] బర్మాను హిందూస్థానమునుండి వేరుపరచినారు.

౬. హిందూస్థానములో నిప్పుడుండు సూబాల (Provinces) విభజనము అవకతవకగాయున్నదని గుర్తించినారు. కాంగ్రెసు వారెన్నడో దీనిని గుర్తించి భాషాప్రయుక్తమునకు తగినట్లుగా రాష్ట్రవిభజన గావించియుండిరి. సైమను సంఘము ఇదేజాడను సూచించుచున్నది.

౭. ఢిల్లీశాసన సభను నిదివరకు లెజిస్లేటివ్ అసెంబ్లీఅని పిలుచుచుండిరి. ఆపేరు బాగుగాలేదు కావున దాని నికముందు ఫెడరల్ అసెంబ్లీఅని పిలువవలసినది అని సెలవిచ్చినారు. దీనిలోని రహస్యమేమనగా మనము మనకు డొమినియను హక్కు కావలెనని అడుగుచుంటిమి. మనకు డొమినియను హక్కిచ్చినట్లైన మన శాసనసభను మనము ఫెడరల్సభఅని పిలువవలసియుండును. కనడా అమెరికాలో శాసన సభలనిదేవిధముగా పిలుచుచున్నారు. కావున నిప్పుడు సైమనుసంఘమువారు డొమినియను హక్కుఇయ్యవలెనని చెప్పకుండినను దానిపేరు యిచ్చిన మనము తృప్తిపడుదుమని అట్లు సిఫారసు చేసినారు. సాధారణముగా మితవాదులిట్టివలలో చిక్కుకొనెదరు వారుకూడ నిప్పుడు వలలో తగులుకొనునట్లు లేదు. అసలు వస్తువియ్యమని యడిగినవారి నీడనిచ్చినట్లున్నదీకథ రొట్టెనడిగినవారికి రాయి యిచ్చినట్లు ఇట్లు నూతన నామకరణమైన సభకు ఎన్నికలులేవు. దీనికి రాష్ట్రశాసన సభలనుండి సభ్యులెన్నుకొనబడుదురు. ఇట్టి సభయొక్కయు కౌన్సిల్ఆఫ్ స్టేటుసభయొక్కయు హక్కులలో నేమియు మార్పులు లేవు.

౮. దేశీయ రాజ్యముల (Indian states విషయములో వీనిపక్షమునుండి యీ బ్రిటిషుఇండియా నుండి కొందరు సభ్యులొక క్రొత్త సభగా నేర్పడి యుభయులకును సంబంధించిన విషయముల మాత్రమే చర్చింతురట? అనగానేమో!!

౯. శాసనసభలకిదివరకు ౩ యేండ్లకొకసారి క్రొత్త యెన్నికలు జరుగుచుండెను ఇప్పుడు ౫ సంవత్సరములు ఏర్పాటు చేసినారు ఇదేవిధమున ఢిల్లీసభకు ౩ ఏండ్లకు మారుగా ౭ ఏండ్లు చేసినారు.

౧౦. ఇదివరలో కొన్ని పద్దులపై శాసనసభలకు మంజూరీ యిచ్చుటకు గాని చర్చించుటకు గాని హక్కులు లేకుండెను. ఇప్పుడును నట్లే కాని యేమియుభేదములేదు సైన్యశాఖ పూర్వమువలెనే యుండును. అంతగా భేదముండదు.

౧౧. ౧౯౧౯వ సం|లో మనకు సంస్కారములు ప్రసాదించి నప్పుడు మనయోగ్యతాయోగ్యతుల విచారించుటకు ౧౦ యేండ్ల వాయిదా వేసియుండిరి ఇప్పుడు వీరు అట్టి నిశ్చయమునిక ముందు చేయమని గట్టిగా చెప్పినారు. అనగా మనకెన్నడు స్వరాజ్యము వచ్చునో ఈశ్వరునికెరుక. ఇవి సైమను కమిటీవారి ముఖ్యమైన సిఫారసులు గాంధిగారి ౧౧ పాయింట్లకు వీరి ౧౧ పాయింట్ల జవాబు చూడుడు. వైస్రాయిగారు బెన్నుగారును మనకు డొమినియను హక్కులనిత్తుమన్న మాటకిదియే యర్థము ఈ యర్థమును గాంధిగారును నెహ్రూగారును డిసెంబరు నెలలోనే గుర్తించియుండిరి మితవాదులు ఇప్పుడైన గుర్తించిరా లేదా? సైమను నివేదిక చాల నిరుత్సాహకరముగానున్నది. వారి సిఫారసులు సిఫారసులే కావు వారిచ్చినది పెద్దసున్న వారి రిపోర్టు వలన మనకేతరమునందును గాని ముందు తరములో కాని తుదకు డొమినియను హక్కు అయినను దొరకునో లేదోయని తోచును ఈ నివేదికా ఫలిత మేమన దేశములో అశాంతి యింకను ప్రబలును. కాంగ్రెసు వాదము బలపడును. మితవాదులకు ఇంక వంకలు చేయుట కవకాశములేదు. వారును బ్రిటిషు వారికి ప్రతికూలురగుదురు. బ్రిటిషు ప్రభుత్వమునకు, ప్రజలకును విశేషముగా సంఘర్షణ జరుగును. ఇప్పటికైనను నివన్నియు మాన్పుటకైన బ్రిటిషు ప్రభుత్వము వారు ప్రయత్నింపవచ్చును. కాని ముందేట్లు జరుగునో యది మాత్రము మా జ్యోతిషమున కందుపాటులో లేదు

కమిషను వారే "దెహ్లీ హనూజ్ దూర్ అస్త" [Delhi is far off] అని సెలవిచ్చినారు. ఇది చాల భావగర్భితముగా నున్నది. దీని భావమేమనగా స్వరాజ్యము యింకను బహుదూర మున్నది. అది దూరమో దగ్గఱనో యికమీద నిర్ణయించు భారము హైందవులపైననే యున్నదనుట నిశ్చయము.

## సిరియా

అరేబియా కుత్తరమున సిరియా రాజ్యము గలదు. జర్మనీ యుద్ధానంతరము మిత్ర మండలి వారు కొన్ని రాజ్యములను పంచుకొనిరి. అందులో సిరియా ఫ్రెంచివారి పాలికి వచ్చినది. కొన్ని రాజ్యములకు సంరక్షణము చాలదనియు వారికిసహాయరక్షణ శక్తి వచ్చువరకు పెద్ద రాజ్యములు వానిని కాపాడ వలెననియు యుద్ధానంతరము ఒక రాజనీతిని మిత్రమండలివారే సృష్టించిరి. మాండేటరీ అధికారమని అట్టి పరిపాలనము పేరు. సిరియా ఫ్రెంచి వారికి వచ్చినదని పైన తెల్పితిమి.

మాండేటరీ అని, రక్షణమని ఎన్ని పేర్లు పెట్టుకొన్నను వానిలోని నిజతత్వము దోపిడితప్ప వేఱుకాదు. శిరియా ప్రాచీన నాగరికత కలది. ఇప్పుడు యూరోపియనులు దానికి బోధించ వలసినపని యేమియులేదు. ఐన బలవంతముగా శిరియా ఫ్రెంచివారి అధీనమునకు తేబడెను. యూరోపియనులు ఇతెర జాతులను చక్కగా పాలింప జాలరనుటకు శిరియా ఇంకొక్క ఉదాహరణము. రక్షకులయినవారు ప్రజల మెప్పుబడసి త్వరలో వారు స్వతః తమ దేశమును పాలించుశక్తి కలిగించవలెను. కాని యూరోపియను జాతుల అధికారములోనున్న ఏ దేశములనైన గాంచుడు. దేశీయులు తమ దేశమును పాలించగలరని పాలకులైన యూరోపియను లొప్పుకొనరు. శిరియాలో గూడ నిట్టిదే సంభవించినది. ఫ్రెంచివారు ఇంత నంత సిరియా వదలిపోవు నిష్టమును సూచింపకైరి. ఆ దేశములో జాతీయవాదులు ఫ్రెంచి వారి నుండి తమ రాజ్యమును వదలించుటకు గట్టి ప్రయత్నమును చేయుచున్నారు. సిరియాకు క్రొత్త రాజ్యాంగ పద్ధతి నిర్ణయము చేయబడెను. కాని ఫ్రెంచి వారందులో సిరియనులకు స్వాతంత్ర్యము లేకుండ నంతచేయవలెనో అట్టి విఘ్నలన్నియు చేసిరి. సిరియను లందున కొప్పుకోలేదు. అప్పైని రాజ్యాంగ పద్ధతిని జారీలోనికి తేకుండ ఫ్రెంచి వారు అడ్డుపెట్టు చున్నారు. సిరియా వారికిది కోపకారణమైనను, విధిలేక జార్జస్యమునకు గడంగ లేదు.

నానాజాతి సమితివారు ఈ విషయమును పరిష్కరించ వలసి యుండెను. కాని అందులో ఆంగ్లేయుల యొక్కయు ఫ్రెంచివారి యొక్కయు పలుకుబడియే విశేషముగా నున్నది. కావున సిరియనుల నెవ్వరు పల్కరింతురు? ఆంగ్లేయుల ఫ్రెంచివారు నొక్కరి నొక్కరు అనలేరు. తన ఆకులో గాడిద పడియుండగా ఎదుటవాని ఆకులో ఈగ వ్రాలినదని దండించుట ఎట్లు సాధ్యమగును. నానాజాతి సమితి దొంగల పంచాతీ కోర్టు అని ఆశియా ఖండవాసులు అనుమాన పడుటలో ఆశ్చర్యమేమున్నది?

---

### రంగూను జైలు ఖైదీల తిరుగుబాటు

రంగూను సెంట్రలు జైలులో ఖైదీలు చాలమంది జైలు అధికారులపై తిరుగుబాటు చేయుటవలన ౨ పహారా జవానులు ౨ సైనిక పోలీసు పటాలము, ౧ లారీ నడుపువాడు, ౮౦ ఖైదీలు మరణించిరి. ౬౦ ఖైదీలు ౧౧ జైలు కావలివారలు గాయస్థులైరి,

---

## అవసరమున్నది

ఒక అనుభవజ్ఞుడైన తెలుగు ఇంగ్లీషు భాషలలో ప్రాథమికవిద్య [ఫుల్ టైం] బోధింపగల ఉపాధ్యాయుని అవసరమున్నది. ఉద్యోగాపేక్షగలవారు వచ్చినవారికి ప్రాముఖ్యతనొసంగబడును, వేతన నిర్ణయము సమక్షమున జరుపబడును,

C/o మేనేజరు
గోలకొండ పత్రికాలయము
ట్రూపుబజారు, దక్షిణహైదరాబాదు



## గోలకొండ పత్రిక

ట్రూపు బజారు హైదరాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | |
|---|---|
| | రు. ౬ ౦—౦ |
| అర్ధ ” | ” |
| | ౩—౧౨ ౦ |
| విడి పత్రిక | ౦—౧ ౬ |

Printed and Published by G. Ramakrishna Reddy Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy.